లేక నేను శావలొ రక్తానికని వంకెట్టుకొని మంత్రితో గలిచి, ఓడెక్కి సముద్రంమీద యుత్తర దేశాలకెళ్లింది నిజం. తుపా నొచ్చి వోడ మునిగింది నిజం—

భటు : నీవెట్లా బ్రదికావు? నీమంత్రేడి ?

దాశ : ఓడతో డింకగొట్టాడు. యీతలో కొట్టుమీను శావలాగ యీ దేవాణ్ణి కామట్టి యీడియీడి యీవలబడ్డాను. అదేదో దేశం— అక్కణ్ణుంచి మనమనుషుల్లోకి వచ్చేసరికే యేభైయేళ్ళు పైన అయింది. ఆలిమీద అలగడంవల్ల యింత కొంపమునిగిం దని రాణీకాళ్ళయిన బట్టుకొని రాజీపడదామని ఎదికి ఎదికి యీ దేశాని కొచ్చేసరికి, రాణీ రాళ్లల్లో గలిచింది. చేపలపల్లె చెట్లల్లో గలిచింది. కూతురింటి కొద్దామని బయల్దేరాను. దార్లో కూతురుకొడుకు సచ్చాడని తెలిచింది. కొడుకుపోవడం చేత యేడుస్తూ రాజ్జెకారం నడుపుకోలేక నాబిడ్డ యెంత కష్ట పడుతుందో ఆ రాజ్జెకారం నా బుజాన యేసుకొందామని మరింత తొందరగా యీడికి పరుగెత్తుకొని వచ్చాను— కూతు రిల్లుగదా అని వచ్చిందుకు యీడ యింతమరేద జరిగింది— చెడి కూతురింటికి వచ్చేవాణ్ణి చెప్పెట్టికొట్టాలి.

భటు : రాజ్యభారము వహించడానికి నీవెందుకు? ఆవిచిత్రవీర్య మహారాజునకు కొడుకులు మనుమలు—

దాశ : యిచిత్తరయీరుడికీ కొడుకులూ! ఆచయదగ్గునాయాలకు సం తెలాగలిగింది? బదికుండంగానే పుట్టారా? చచ్చినాక పుట్టారా!

భటు : (మెల్లగా) నీమనుమడి భార్యలు వ్యాసభగవానుని యనుగ్ర మువల్ల వంశము నిల్పారు.

దాశ : హా! సస్తిని—సస్తిని. మగడు సచ్చినాక సంతుగనే కులం యేకులం మారుమనంకులం—యెక్కవోళ్ళ యెవారం యిలా గుంటుంది—యీళ్ళతో చమందం చేసినోళ్ళకు కులంలేదు అయితే ఆ యిచిత్తరయీరుడి కొడుకులు గూడ కొడుకుల్నిగన్నారు—

భటు : ఒకాయన నూర్గురుని— రెండోఆయన అయిదుగుర్ని—కని సచ్చాడు—

దాశ : అబ్బ్యగూడ యిలాటివోళ్ళే అనుకుంటా!

భటు : అది యింకారహస్యం— ఉన్నదిలే. యిప్పుడు వాళ్ళు వీళ్ళు రాజ్యభాగాలకు జుట్టుజుట్టు పట్టుకోవడానికి సిద్ధపడుతున్నారు. వాళ్ళకు వీళ్ళకు రాయభారం జరుపుటకు శ్రీకృష్ణభగవానుఁడు వచ్చాడు. రాయభారం రంగం జరుగబోతుంది—

దాశ : ఉన్న దేదో సరిసమానంగా బంచుకోకుండా యెర్రినాయాళ్లెం దుకు పోట్లాడాలి, అయితే యీళ్ళు నాకేమవుతారు. మనుమడి మనుమలన్నమాట—సరే; నేనెల్లి యీళ్ళచెంపలు వాయఁ గొట్టి యీ సువారం పరిస్కరిస్తాను.

భటు : ఆగు—ఆగు—ఏడకువెళ్తావు?

దాశ : రాచసబకు.

భటు : వీలులేదు. ఇప్పుడు రాజగు దుర్యోధనచక్రవర్తికిఁ దమ్ముఁడగు దుశ్శాసనులువారు "సత్యవతి బంధుగులమని చాలమంది వచ్చి తేరతిండి తింటున్నారు. వాళ్ళను వెళ్ళఁగొట్టటమేకాకుండా, యిగమీఁద అలాచెపుతూవచ్చేవాళ్ళను కట్టివేసి పిచ్చాసుపత్రికి పంప"మనిఆజ్ఞచేశారు. కాబట్టి నీవిప్పుడు పిచ్చాసుపత్రికి నడు.

దాశ : ఆరి వీడితప్పాసిగోయ్యా! ఎంచేత అలా ఆగ్నచేశాడు?

భటు : తిండికి వృథావ్యయమని పైగా— చేపలవాళ్లు రాజకుటుం బానికి బంధువులమని వస్తే అవమానం అని—

దాశ : అవమానమా! సీ! సీ! శాపలోళ్ళపిల్లనిచేసుకోవడం, దానికి పిల్లల్నిగనడం, ఆళ్ళకు పుట్టడం, అవమానంగాదు—ఆళ్ళ బం దుగులు గావడం అవమానం— సీ! సీ! యెక్కువోళ్ళకు పిల్ల నివ్వడంకంటె యేట్లోబడేయటం మంచిది. ఏదో జుట్టుకుందా మని తలకుమించిన చమందం చేస్తే— ఆఖరుకు గలిగే లాభం అంతా యింతే! ఆ! అంతే! ఏమంటావు?

భటు : ఆ! అంతే!

దాశ : ఎక్కువోళ్ళతో చమత్కారం చేయ నేకూడదు- చేస్తే ఆళ్ళ యింటివరకు రానేగూడదు. అందుట్లో చెడి ఆడపిల్లే రాగూడదు, చెడి కూతురింటికి వచ్చిందానికన్నా—జో లెగట్టుకొని అడుక్కు తింటే మంచిది. ఆ! అంతే!

భటు : అంతే! (నిష్క్రమింతురు)

3 దృశ్యము.

(ప్రదేశము—రాజసభామండపము)

(ప్రవేశము—ధృతరాష్ట్ర విదురులు భీష్మద్రోణులు, దుష్టచతుష్టయము. మునులు, శ్రీకృష్ణుడు)

శ్రీకృ : బావా! దుర్యోధనా! పాండవులు పైతృకంబగు రాజ్యభాగమును నిమ్మనుచుకొని నన్నుంపుచున్నారు. వారు నీపంపున బండ్రెండేండ్లరణ్యవాసమును, ఒకయేడు అజ్ఞాతవాసమును గావించి తిరిగివచ్చి తమ యర్ధరాజ్యమును నపేక్షించుచున్నారు.

దుశ్శా : అజ్ఞాతవాసము పూర్తిగాకపూర్వమే ఫల్గునుడు ఉత్తరగోగ్రహణంబున మాకంటబడి, సమయభంగము గావించి తన వ్రేలితోడ దనకన్నే పొడుచుకొన్నాడు.

శకుని : కావున దిరిగి ద్వాదశవర్షములు అరణ్యవాసమును, ఒక సంవత్సర మజ్ఞాతవాసమును గావించి బ్రదికివచ్చినయెడల, అప్పుడు పాలొసంగుటకు రారాజు సందేహింపడు.

భీష్మ : దుశ్శాసనా! అర్జునుడు ఉత్తరగోగ్రహణంబున మనకంటబడిన నాటికే అజ్ఞాతవాసవత్సరము సరిగా బూర్తియైనది.

దుశ్శా : ఓహో! పాండవపక్షపాతము!

భీష్మ : కాదు. ధర్మపక్షపాతము!

దుర్యో : సోదరా! నీవు మిన్నకుండుము. శ్రీకృష్ణా! పైతృకంబగు రాజ్యభాగమేమి? విచిత్రవీర్యాత్మజులలో నా తండ్రి ధృతరాష్ట్రుడే పెద్దవాడు. రాజ్యార్హుడగ్రజుడే! తమ్మునికి భాగమెక్కడిది? అతనికి లేనిభాగ మతని సుతులకెక్కడిది? నీ వెఱుంగని క్షత్రియధర్మ మేమున్నది?

భీష్మ : క్షత్రియధర్మ మాలోచించిన జాత్యంధుఁడు రాజ్యార్హుఁడే గాఁడు, పాండురాజే

దుర్యో : పాండురాజే యంగీకరించి నాతండ్రిని సింహాసనమెక్కించి తాను భృత్యుఁడై మెలంగినాఁడు. అప్పుడు కురుపితామహులు గూడ నొప్పుకొన్నారు.

భీష్మ : సుయోధనా! అయిన రాజ్యానర్హుఁడగు పుట్టుగ్రుడ్డిని నీతండ్రిని స్వాభాత్రంబున రాజుగావించిన, ఆ పాండురాజు నందనులయెడ నీవు చూపవలసిన యాదరణయా యిది? ఇదియా క్షత్రియ ధర్మము?

కర్ణ : క్షత్రియధర్మము సంగరమొనర్చి రాజ్యముఁ గైకొనుటయేగాని లేనిభాగమునకు రాయబారము లంపుటగాదు.

దుర్యో : అవును.

శ్రీకృ : ఓ దుర్యోధనా!

శా. శాంతింగోరినవారు వారగుటచే - సంధింప నన్నంపినా
రంతేగాని సమిద్విహారమున కా - వంతేనియున్ జంక రా
కుంతీనందన శౌర్యసాహసములున్ - గోదండపాండిత్యముల్
పంతంబుల్ వచియింప నేటికి కవి వి - శ్వక్షోణి విఖ్యాతముల్.

దుర్యో : శ్రీకృష్ణా! స్తోత్రపాఠములు చాలింపుము. వారు వీరులైనచో యుద్ధముచేసియే కురురాజ్యసింహాసనము నాక్రమింతురుగాక!

శా. ఏకచ్ఛత్రముగాఁగ నేలవలె వా - రేగాని నేఁగాని, యం
తేకానీ! యెవరెట్లువాకొనఁ గా - నీ! భాగమేనిత్తునే?
నాఁకున్ భీతియొ! వారి శౌర్యములఁ నె - న్నన్, రాలునే గాలికేఁ
తాకుల్? మాధవ! కట్టిపెట్టుము తదీ - యస్తోత్రవాక్యావళుల్.

శ్రీకృ : గాంధారీనందనా! దుర్యోధనా! అర్ధభాగమీయ నిచ్ఛగింప కున్న నయిదూళ్ళయిన నిమ్మని వారడుగుచున్నారు.

దుర్యో : బిచ్చము? కాని యిది అపాత్రదానమే?

ఉ. ఆయతపాండితీనిలయు - డంచు నొసంగనా? వేదధర్మముల్
వాయక భూస్థలిన్ మెలఁగు - పాఱుఁడటంచును నిత్తునో? జగ
దేయ కవీంద్రులం చిడనా - దీను లనాథలటం చొసంగనో?
దాయల కేమి? యూళ్ళయిదు-దానము సేయుటయేమి? కేశవా!

శ్రీకృ : సుయోధనా! నీవు దాతవుగానక్కఱలేదు. దానము సేయనక్కఱలేదు. ఇప్పుడు కురురాజ్యమునకు నీవు పాలకుండవై యుంటివి గనుక న్యాయము సేయుము. ఈ రాజ్యమునఁ జాల భాగము పాండురాజ భుజబలార్జితము. వా రాతనిపుత్త్రులు. అయిదూళ్లుమాత్రమిమ్ము.

శకు : అయిదూళ్లిచ్చినను అర్ధరాజ్యమిచ్చినను పాలుపంచి యిచ్చుటయే! ఇది దానమని యెవరును సంస్తుతింపరు.

శ్రీకృ : పాలుపంచియిచ్చుటయే కానిమ్ము—దానఁ మీకు సత్కీర్తియే గాని దుష్కీర్తి గలుగదు.

దుర్యో : తప్పక కలుగును.

శ్రీకృ : ఏమని?

దుర్యో : వారితో యుద్ధము సేయుటకు జంకి కౌరవు లీవిధముగ పాలు పంచియిచ్చిరని!

శ్రీకృ : అయిన నీవిందుల కంగీకరింపవా?

దుర్యో : ముమ్మాటికి!

శకు : వేయిసార్లకు!

దుశ్శా : లక్షసార్లకు!

భీష్మ : నాయనా! దుర్యోధనా! దుర్మానము దుర్దశామూలము. అధర్మమునకన్న ధర్మము బలీయము - అధర్మపహతుండవై ధర్మమూర్తులగు పాండవులతో వైరము పెట్టుకొనకుము.

గీ. హితమెఱిఁగి వారిభాగమీ - పీఁచు వేని
సమరమునఁ, ప్రజాసౌఖ్యమ్ము - సమసిపోవు
విప్లవము దేశమందు నా - విర్భవించు,
ప్రబల రక్తప్రవాహముల్ - పాఱునయ్య!

మహావీరులగు వారితో నీవు కలసియున్న మిమ్ము దేవనాథున కైనఁ దేటిచూడ శక్యముఁ- అధికారమ్మున నుండుటంజేసి పెక్కుయోధులు నీకు సహాయులున్నను వారిది ధర్మపక్షమగు టంజేసి వారికి సాయము సేయువారుండకపోరు. యుద్ధము తప్పక జరుగును. జయాపజయమ్ముల మాట యటులుండ నిరు బలగమ్ముల ననేక శూరులు మరణించుట ధ్రువము- దాన దేశము నిర్వీర్యమై పరిపాలించు సమర్థులులేమి నంతఃకలహ ములలోఁబడి తుట్టతుదకు బరాధీనమైపోవును-ఇట్టి దుష్కీర్తికి నీవు పాలుగాక వారిపాలు వారికొసంగుము.

దుర్యో : శుష్కవన్యాసములకు సుయోధనుఁడు బెదరఁడు.

శకు : సత్యము.

దుశ్శా : సత్యము.

శ్రీకృ : సత్యము- దుశ్శాసనా! సత్యము.

గీ. కొండవలిని గడ్డిఁగట్టి - కొట్టఁగాక
చింతకాయలు రాలునే - మంత్రములకు?
పెనుగదాహతిఁ దొడవిఱిఁ గినను గాక
సంధికొప్పునె దుర్మాన - చక్రవర్తి!

దుర్యో : యాదవా! అనవసర ప్రసంగము గావించుచున్నాఁడవు-

శ్రీకృ : అవసరమైన ప్రసంగముననే గావించెదను. వినుము. ఓ రాజ రాజా !

సీ. పాండుపుత్త్రుల కీర్తి - పాలొసఁగవయేని
పాలువారికొసఁగెద - నాలకింపు!
సురనదీసంభవ - సహస్రపత్త్రసైంధవ
కర్ణాది వీరులు - కత్తిపాలు
చావగుకుండు దు - ష్టమ్మున్న పత్ మీకు
మారవర్గం బభి - మన్యుపాలు
శకుని నీమామయ్య - సహదేవుపాలు, న
కులుపాలు కర్ణుని - కొడుకులెల్ల

గీ. నీకు సోదరశతముతో - నీవు భీము
సేనుగదపాలు, కురురాజ్య - సింహాపీఠి మాకు సంక్రమించు
మరకలేని కీర్తియును ధ - ర్మజునిపాలు సౌమ్యతను
తప్పదింతయుఁ దథ్యంబు - ధరణినాథ!

దుర్యో : ఈజోస్య మెవరుగుణించినది?

శకు : త్రికాలవేది యాదవసింహము-

దుశ్శా : ఓహో! గొల్లలు జోస్యము సెప్పుచున్నారు. కలికాల మారంభమగుచున్నది కాఁబోలు—?

శ్రీకృ : ద్వాపరయుగమున వసనీశాగముదఁగిన పిమ్మటఁగాని కలి యారంభము గానేరదు.

శకు : స్వాముల వారందులకే జన్మించినవారఁటగదా?

భీష్మ : సత్యము- అధిక్షేపించు వథమాధములుగూడ శీఘ్రకాలములో నాసంగతి నెఱుంగుదురు.

శకు : అంత పండుగదినమా యీకన్నులకు?

భీష్మ : నీకన్నులకు పండుగదినము వచ్చుటకే కౌరవపాండవ కలహ నాటకమునకు ద్యూతనాంది నారంభించితివి. కపటసూత్రధారి!

శకు : కపటసూత్రధారి శౌరికాఁబోలునే!

దుర్యో : మాధవా! వేయిమాటలెందులకు? వారికి రాజ్యము గావలసియున్న యుద్ధముసేసి తీసుకొనుఁడని చెప్పుము- ఇదియే నీసంధికిఁ బ్రత్యుత్తరము!

శ్రీకృ : ఓరాజరాజా! బాగుగా నాలోచించుకొనుము- తరువాతఁ జింతించిన లాభము లేదు.

సీ. గాండీవి విల్లూని - చండకాలుఁడువోలెఁ
జండత మిమ్మెల్లఁ - జెండువేళ
భీముండు చలమూని - పెనుగదం జేఁబూని
మృత్యువో యన ననిన్ - బేర్చువేళ...

గురువృద్ధ కులవృద్ధ - పరమబాంధవకోటి
తెగి స్వర్గమున కరు - దెంచువేళ
ద్విరదాశ్వరథ పదా - తివ్రాతములు సంధు
లెడలి పెన్గుప్పలై - పడెడువేళ

గీ. బీరముడిపోవ బ్రాణాశ - నోరు నెత్తి
గొట్టుకొని యేడిపాదముల్ - పట్టుకొన్న
సంధిసేయరారెవ, రిదె - సంధికదను
బ్రదుకదలంచినచో మీరు - బావగారు!

ధృత : నాయనా! మాధవుని యుపదేశము మన్నింపుము.

దుర్యో : గోపాలా! నోరుమూసికొనుము. క్షత్రియులకు సంగర భయము, చేపకు నీటిభయము గలిగింప నీతరమా? వెడగు బెదరింపులుమాని వేగంబ యాపాండుపందనుల కడకుం జని వారితో నామాటలుగా నిట్టు వాకొనుము.

సీ. ఐదూళ్లుగాదు నే - సూదిమోపినయంత
యిలనైన వారల - కీయననుము
కన్నీళ్లుగార్చినం - గాదు రక్తము గార్చ
లభ్యమగును రాజ్య - లక్ష్మియనుము
క్షత్రియాన్వయులకు - సంగరమ్మునం జావు
వచ్చిన లోకమ్ము - మెచ్చుననుము
కవ్వడి భీముండు - గావించు ప్రతినలు
నెఱవేర్చుకొన నిదే - తరుణమనుము

గీ. తనయసోదర మిత్రబాం - ధవులతోడం
జచ్చుంగాక దుర్యోధన - చక్రవర్తి
జంకి యంగీకరింపండు - సంధికనుము
వెట్టి రాయబారముమాని - వేగంజనుము.

శ్రీకృ : మూఢదుర్యోధనా!

దుర్యో : యాదవా! సుయోధను నెఱింగి మెలంగుము. అధిక ప్రసంగములు చాలింపుము.

శ్రీకృ : దుర్యోధనా ! నీవును శ్రీకృష్ణు నెఱుంగుదువుగాక! నీకు వినాశ కాలము సమీపించినది.

దుర్యో : దూత కనుచితములగు మాటలు మాటాడుచున్నాఁడవు. జాగ్రత్త! దుర్యోధనుఁ డవమానమును సహింపఁడని తెలిసి కొనుము.

శ్రీకృ : మూర్ఖుఁడా! నన్ను బెదరించుచుంటివా! శ్రీకృష్ణుఁడెవరికి భయ పడువాఁడు కాఁడని నీవును దెలిసికొనుము.

దుర్యో : నిన్నిచ్చట బంధించిన నీ పాండవులు నీకు దిక్కగుదురా !

శ్రీకృ : అందరకు దిక్కు నేనే? నాకొకరి దిక్కేల? నను బంధింతువా? ఓయీ! భక్తియను త్రాళ్లనుగాక తక్కుత్రాళ్ల నీ శ్రీకృష్ణు నెవ్వరును బంధింపనేరరు. అంతేకాదు! ఈ శ్రీకృష్ణుని డాకాలి వ్రేలిగోరును స్పృశించుటకుఁగూడ మీకెవ్వరికి సాధ్యముగాదు.

(దుష్టచతుష్టయము సైగలుచేసికొని నిష్క్రమింతురు.)

(అందరు భయసంభ్రమములతోఁ జూచుచున్నారు.)

శ్రీకృ : ఎవ్వరును భయపడనక్కరలేదు. దుష్టచతుష్టయము దురా లోచన సేయనిండు. కురుపితామహా! గంగానందనా! అధర్మ పక్షమునువీడి ధర్మపక్షమునఁజేర నిన్ను నే నాహ్వానించు చున్నాఁడను.

భీష్మ : స్వామీ! సకలజగదంతర్యామి! నా హృదయము నెరింగియు నన్నిట్లాహ్వానింతువా? దుర్యోధనుఁడిప్పుడు నాకు రాజు. నే నాతని సేవకుండను.

శ్రీకృ : దుర్యోధనుఁడు రాజా! అసత్యము, మాయ సేసి యన్యాయ ముగ నితరుల రాజ్యభాగ మపహరించి సింహాసన మెక్కినవాఁడు ఱేఁడుగాఁడు, దోపిడిగాఁడు. అట్టివాని కెవ్వరు సాయము సేయ నక్కఱలేదు. వానికెదురుదిరుగుట పాపముగానేరదు. మరి పురుషార్థము !

భీష్మ : మహాత్మా! నిఖిలధర్మవిదుండవు నీ వెరుంగనిదేమి ? కురు సింహాసనమున కీ శరీర మమ్ముడుపోయినది. ఈ సింహాసనము నేను బుద్ధిపూర్వకముగ జనకహితముకొరకుఁ ద్యజించునప్పుడు దీని నెవరధిరోహింతురో వారి కేను భృత్యుండనై యుందునని సపథము సేసియుంటిని. కావున దుర్యోధనుని విడిచి రాఁజాలను, కృష్ణస్వామీ!

గీ. ధరణిపాలన విడిచితిఁ – దండ్రికొఱకు
పరిణయము విడిచితిని సో – దరులకొఱకు
రక్తమును విడిచెదను రా – రాజుకొఱకు
ప్రాణముల విడిచెదను ధ – ర్మమ్ముకొఱకు.

శ్రీకృ : తథాస్తు. (లేచుచున్నాఁడు)

(ప్రవేశము—దుష్టచతుష్టయము త్రాళ్ళతో)

దుర్యో : బంధింపుఁడు. కృష్ణుని బంధింపుఁడు.

శ్రీకృ : బంధింపుఁడు. ఊఁ, బంధింపుఁడు. మూఢదుర్యోధనా! వారు నిలువుగ్రుడ్లుపడి చూచుచున్నారు! సింహామువీఁదికి మేఁక పిల్లల నుసికొల్పిన నేమిలాభము? మత్తగజేంద్రమవు, నీవు రమ్ము. బంధింపుము. బావా! బంధింపుము.

ఉ. తావరమూని దూతయను – గారముమాని వృదాభిమానివై
కేవల మర్త్యుఁగాఁదలచి – కృష్ణుని విష్ణునిఁ ద్రాటఁగట్టఁగా
భావమునందలంతె? మద – వత్కరిఁ దామరతూఁటఁ గట్టెదే?
బావ! మహోగ్రవహ్నివలు – వస్ ముడివైతువె బుద్ధిశాలివే?

(విశ్వరూప ప్రదర్శనము)

తిలకింపుఁడు, నా భక్తులందరికి దివ్యదృష్టినొసంగితిని దిలకింపుడు!

(దుష్టచతుష్టయము పడిపోవును. తక్కినవారందరు ఆనందముతోఁ జూతురు.)

(కొంచెముసేపు తెరవ్రాల్చి తిరిగి యెత్తవలెను)

దుర్యో : పక్షి యెగిరిపోయినది.

భీష్మ : మూఢ దుర్యోధనా! నీప్రాణము లెగిరిపోకుండఁ జూచుకొనుము. సంధిఁజేసికొనుట కింకను తరుణమున్నది, చూచితివిగదా శ్రీకృష్ణుని ప్రభావము.

దుర్యో : ప్రభావముగాదు. ఇంద్రజాలము.

శకు : మహేంద్రజాలము.

దుశ్శా : నిక్కము.

శకు : ఇందేమియు సంశయము లేదు.

దుర్యో : విజయమున నాసంశయము?

భీష్మ : ధర్మమునకా జయము సంశయము. నాయనా! "యతో ధర్మస్తతః కృష్ణో యతః కృష్ణస్తతో జయః"

దుర్యో : కురుపితామహా! మీకట్టి నమ్మకమున్న పాండవుల పక్షమున కరిగి జీవింపుఁడు.

భీష్మ : మూర్ఖుఁడా! నేను జీవములకు భయపడుదునా? స్వచ్ఛంద మరణుఁడనగుట నీవెఱుంగవా!

శకు : కావుననే యీ యుద్ధమున సర్వసైన్యాధిపత్యమును మీకుఁ గట్ట దుర్యోధనుఁ డిచ్ఛగించుచున్నాఁడు. దుర్యోధన సార్వభౌమా! అవునుగాదా?

దుర్యో : అంగీకరింతురా?

భీష్మ : అంగీకరింతును.

దుర్యో : తమ్ముఁడా! భీష్మాభిషేచనమునకుఁ బ్రయత్నము గావింపుము.

దుశ్శా : చిత్తము. (తెరవ్రాలును)

పంచమాంకము.

సంపూర్ణము

# భీ ష్మ బ్ర హ్మ చా రి

## ష ష్ఠాం క ము

### దృశ్యము 1.

(ప్ర దేశము—పటకుటీరము)

(ప్రవేశము—అర్ధరాత్రమున జపముచేయుచు భీష్ముఁడు)

భీష్మ : (స్వగ) దీర్ఘసుమంగలి యగునట్లు దుర్యోధన పట్టమహిషి యగు భానుమతీదేవిని దీవింప సంకల్పించి, యిటకు రమ్మని వార్తనంపితిని. గాని యింకను రాదయ్యెను; కారణము తెలియదు. పది దినములనుండియు, రణముసల్పిన కారణమునఁ నాయవయవములన్నియును, విశ్రాంతిఁ గోరుచున్నవి. శ్రీకృష్ణుని యవతారమునకు సార్థకముగా భూభారమెంత చిత్రముగా వాయుచున్నదియో—

గీ. దేవదేవుఁడు, దేవకీ - దేవి గర్భ
జలధినుదయించె; పాపనా - శనముకొఱకు;
అట్లుగా దేని, తాను మా - ద్యస్థమూని,
సదయుఁడై రాయబారము - సలుపుటేమి?

కౌరవులలోన, నొకఁడైనఁ - గాని యతని
బోధ వినకుండుటేమి? యీ - భూమిభార
మణఁగుటకునయి ఘోరమా - నావహానమ్ము
జరుగు హేతువు ప్రభవిల్లు - కొఱకె కాక

పాపమదివండె; పుణ్యమా - బద్ధమయ్యె
కలియుగంపు చిహ్నంబులు - గానవయ్యె
ధర్మసంస్థాపనముఁ జేయఁ - దలఁచి, శౌరి
కాలసూత్రంబులను నెల్లఁ - గలయఁగట్టి

ప్రకృతిరథమును, నడిపింపఁ - బాలుపడియె
సకలనిననాశ మిప్పటి - సంగరమునఁ
దప్పదెటుగన్నఁ దత్తద - ర్థంబెఱిఁగె
నడుపుచున్నాఁడు శౌరి; పాం - డవులనెల్ల
మీరలెండ రెండఱుచేరి, - పెనఁగులాడి
యనిమొనర్చిన ఫలము ర - వంతయైనఁ
గలుగఁబోదదు; నిజము—శ్రీ - కరముగాఁగ,
పాండుతనయులె యూధరా - పాలనంబు
సేయఁగలనారు; సంతత - శ్రీనిధాను
లగుచు శ్రీహరి సత్కృపా - ప్తాసులగుచు.

(తరువాత చేతనొక దివిటీగొని; రజక వేషమున దాసిజాష్ట్ర కృష్ణుఁడును, భానుమతి వేషమున ద్రౌపదియు ప్రవేశింతురు)

కృష్ణు : మహారాణిగారికి మార్గము ఇటు—ఇటు—

ద్రౌప : పితామహా! నమస్కారము !

భీష్మ : (స్వగ) భానుమతికాఁబోలును వచ్చినది. నావలన కౌరవులకు జయలాభ మెట్లును గలుగదు. కావున, నీమొపతికి జయము గల్గునట్లు దీవించెదఁగాక! పైన కాగలకార్య మెట్లు కానున్న నట్లగును. (ప్రకా) అమ్మా! నాకులాలంకారమా! వచ్చితివా! నాసమీపమున, నవనతశిరస్కవై నిలుపఁబడుము. నిన్ను దీవింపఁ బిలుపనంపితిని.

ద్రౌప : మహాప్రసాదము. (దగ్గఱ తలవంచి నిలువఁబడును)

భీష్మ : (చేయి తలపై నిడి) సతీ! సౌభాగ్యవతీ!

గీ. సంక్షుభిత కురుపాండవ - సంగరమున
హీనులై నీరిపులెల్ల నశి - యింత్రుఁగాత!
నీపతికి శత్రుజయంబు - నిశ్చయంబు
ఆమరణము సుమంగలి - వగుదుగాక!

ద్రౌప : స్వామి! భాగ్యవతి నైతిని.

కృష్ణు : మహాత్మా! గంగానందన! నీ యాశీర్వచన మింతబలవత్తరం

బైయుండ నీ భక్తులై-పౌత్రులైన పాండవులకుఁగాని వారల దారయగు నీ ద్రౌపదికిఁగాని కొంతయేమి?

భీష్మ : పాండవులేమి? ద్రౌపదియేమి? ఆశీర్వచనమేమి ?

కృష్ణు : తమరిప్పుడనుగ్రహించిన మహదాశీర్వచనము ద్రౌపదికిఁగాని భానుమతికిఁగాదు.

భీష్మ : ఏమి? ఈ మేలిముసుంగుచాటున నున్నది ద్రౌపదియా ?

కృష్ణు : చిత్తము.

భీష్మ : భానుమతి రానేలేదా ?

కృష్ణు : ఇప్పటికిరాలేదు.

భీష్మ : అట్లయిన చాకలివేషమునందున్న నీవు నల్లగొల్లండవేనా ?

కృష్ణు : స్వామీ! బాలుని యపచారమును మన్నింపుము. సోదరీ! పాంచాలీ! తాతగారంతి దయగలిగెను. ఇంక మన కీ వేషములేల?

(నిజాకృతింజూపును)

ద్రౌప : (మేలిముసుఁగుతీసి నమస్కరించును.)

భీష్మ : సుమంగలీభవ! అమ్మాయీ! లెమ్ము. (ఆలోచించి తలపరికించి) కాలవికృతి కెవ్వరేమిచేయఁగలరు. కృష్ణా! నీవంటి సర్వజ్ఞుఁడు తోడునీడయై పాండవులకు దారిఁజూపుచుండఁగా - నాయాశీర్వచనమునకు భానుమతియేల పాత్రురాలగును?— నీ కృపచేతనే పాండవులు జయింపఁగలరని యెఱింగియు వెఱ్ఱి భ్రాంతిచే నేను భానుమతిని దీవింపతలచితిని. నీ వెఱుఁగనిదేమి గలదు?-సర్వమును తారుమారైనది; పాండవులే జయింతురు. ఇంక నే నేమిపలుకఁగలను?—

కృష్ణు : పితామహా! కౌరవపాండవయుద్ధమున నీవెట్లును హతాశుఁడవే యై యుంటివిగదా! కావున నొకప్రశ్న కుత్తరమొసంగుము.

భీష్మ : కృష్ణస్వామీ! నీయాజ్ఞ కన్యథాత్వముగల్గునా?

కృష్ణు : పదిదినములనుండియు మిమ్ము జయించు పూనికఁ బాండవులు మిగులఁ బ్రయాసపడుచుండిరి. ఒక్కింత యుష్మన్మరణ రహస్య మెఱింగించితి వేని కృతార్థులగుదురు.

భీష్మ : గోవిందా! ఇంక నామరణ రహస్యమును దాచినందువలన మాత్రమేమి ప్రయోజనము? నాజనకు సనుగ్రహమున స్వేచ్ఛామరణమునందఁగల నేఁడు భూపతితుఁడనై నను నాయిచ్ఛవచ్చిన కాలంబునకే జీవన్ముక్తిగాంతును.

కృష్ణ : పోనిండు. తాముభూపతితులగు మార్గమైన దెలిపినఁజాలును;

భీష్మ : నన్ను సాధింపఁదలఁచ చితాగ్నింగూలిన కాశీరాజపుత్రికయగు నంబ యిప్పుడు జన్మాంతరమునంది పేఁడిరూపున శిఖండియై యున్నది, నాకు పేఁడిన కంటఁజూడనని వ్రతము-కావున నా శిఖండి నెదుటనుంచుకొని వెనుకనుండి శరప్రయోగమొనర్చి నచో నే నస్త్రసన్యాసముచేయుదును-ఇదియే రహస్యము.

కృష్ణ : దేవా! పాండుసుతులు నీదయచే జయలక్ష్మి ననాయాసముగఁ జూరగొందురు.

భీష్మ : జగద్రక్షకా! అఖిలాంతర్యామివగు నీవు నాకీమాట దక్కింప వలయునని నాచే ననిపించితివిగాని నీవెఱుంగని దేదిగలదు! అదిగాక స్వామీ!

గీ. పాండుసుతరక్షణంబు నీ - పాణితలము
నందెయుండఁగ మాకృప - యిందుగలదె?
ధరణి నీరూపకపు సూత్ర - ధారివీవ
గాన- నిడిపింపుమయ్య నీ - కాంక్షకొలది

కృష్ణ : మహాత్మా! ధన్యోస్మి! తిరిగి రేపు రణముఖంబున పార్థసారథినై శిఖండితోఁ గాన్పింతును.

(అందఱును నిష్క్రమింతురు)

దృశ్యము 2.

ప్రదేశము—కురుక్షేత్ర సంగ్రామభూమి.

ప్రవేశము—ధనుర్ధరుఁడగు భీష్మసేనాధిపతి:

(పాట 21)

భీష్మ : ఓహో! సైనికులారా!

చ. మనవయిఁ గౌరవేశ్వరుఁడు - మానము ప్రాణముడాచియుంచె; నీ
రణమునసెల్ల వీరులుఁ బ - రాక్రమవైఖరి యొప్పఁగేల న
మ్మనుధనవున్ వడిఁగొని య - మోఘబలమ్మున సంగరమ్మొన
ర్చిన జయశీలుఁడౌను కురు - శేఖరుఁడింతతలంచి పోరుఁడీ!

ఉ. గాజులు కేలఁదాల్చి రిపు - కాండమువవ్వఁగ బారిపోకుఁడీ
మీరాజనయిత్రులన్ సుతస - మేతలగా నొనరింపఁజూడుఁడీ
రాజితశౌర్యసంపద న - రాతులువెన్నులు జూపునట్టుల
వ్యాజధరేశభక్తియుతులై - ఘటియింపుఁడు కీర్తిసంపదన్.

(తరువాత-కృష్ణార్జునులు రథస్థులై ప్రవేశము)

అర్జు : బావా!

(అనుబంధము 21)

చ. ముదుకఁడుగాఁడితండు; రణ - భూములఁగేవల రుద్రమూర్తియై
సదమదమందఁజేయుఁ గలశాంబుధిఁ - ద్రచ్చెడు మంతరంబనన్
పదిదివసంబులయ్యె; నొక - పట్టున శ్రాంతివహింపఁడీతఁడే
బ్రదికిన నేఁడు, రేపునన - వారిజయంబు నభఃప్రసూనమే.

కృష్ణ : అర్జునా! ఈదినంబున వెనుకటియట్లు మనకాందోళనంబుతోఁ బనిలేదుగదా! మనము భీష్మునెదురొ్కందము రమ్ము.

(ఇరువురును పరిక్రమింతురు)

కృష్ణ : మహాత్మా! గంగానందన! అంతయుఁ దమయాశీర్వచన బలమే! పాండునందనుల నెట్లుగెలిపింతువో.

భీష్మ : కేశవా ! బంధువాత్సల్యములు భండనానంతరమునఁగాని భండనమధ్యమునఁగాదు. ఇప్పుడు మనము మనబలాబలంబులను ప్రదర్శించుకొనుటకే తగిన సమయముసుమా!

కృష్ణ : తమ యాలోచనము సమంజసంబైనది. పార్థా! పితామహుని యాజ్ఞానుసారము రణారంభము చేయుము.

అర్జు : తాతా! దేవవ్రతా!

గీ. బాలుఁడే సంగరమొనర్చె; - బ్రథమమునంచు
ప్రౌత్రుడేచూపె తొలఁదొల్త - నాత్రమంచు
మాకు దుష్కీర్తిరానీక - బ్రాకటముగ
బ్రథమమునమీరె శరపంక్తి - వదలవలయు.

భీష్మ : ఫల్గునా! సంగ్రామధర్మమునఁ కీశళభిమ లక్ష్యరలేదు. ఐనను నీవు కోరితివిగావున, నేనే తొలుత బాణములను విడిచెదను.

(శరములు వదలును)

అర్జు : ఆర్యా! ధన్యోస్మి! ఇంక నేనును రణారంభము చేయుదును.

(ఇద్దఱును యుద్ధముచేయుదురు)

(అనుబంధము 22)

కృష్ణు : అర్జునా! అర్జునా! ఈభీష్ముని మహాసంగ్రామకౌశలము నాకు భరింపనశక్యమై యున్నది. అశ్వశరీరంబులదం గుష్ఠ ప్రదేశమైన గాయముగాకుండ నుండలేదు. ఈడుమీరినివాఁడయ్యును నీతఁడు మధ్యాహ్నదినమార్తాండ బింబంబుకైవడి వెలుఁగుచున్నవాఁడు, నీవింక నీతని నుపేక్షించిన మహాప్రమాదము కలుగఁగలదు. నీవుపేక్షింతువేని నాసమయ భంగము నకైన నోర్చి చక్రాయుధంబున నీ భీష్ముచుస్తకంబును విధ్వస్తము గావింతును. (చక్రముధరించును)

(పాట 22)

అర్జు : (అడ్డమువచ్చి) బావా! యదునందన!

శా. బావా! పావనభంగిసల్పఁదగు; శం - భత్రోర్ధసంహారమున్
నీవారిన్ మము; పాండునందనసుతా - నీకంబుఁగాపాడి మా
ప్రావీణ్యంబు యశంబు ధాత్రివికసిం - పంజేయు దే నాఁగుమా
యీవేచక్రముఁదాల్ప నివఁగలవే - యీరేడులోకంబులున్.

బావా! యదునందనా! శాంతముఁదాల్పుము - పిన్నవాఁడనగు నాప్రార్థనంబాలకించి మన్నింపుము. సర్వక్రియాశక్తిస్వరూపుఁడవగు నీవే లోకసంహారమొనరింప సముద్యోగించిన నీరణమేల? ఈ మారణమేల? మాకీ ప్రేరణమేల? కన్నుమూసి

నంతమాత్రమున లోకవిలయంబాపాదింపఁజాలవే! శ్రీకృష్ణా నీబావమఱఁదులు వీరులను మహాశయంబును నిలుపుట నీ కవశ్యాచరణీయ కార్యంబుగాదే! జనార్ధనా! రమ్ము—రథా వరోహణంబుగావింపుము; నీకివే పునఃపునఃప్రణామందులు.

కృష్ణు : ధనంజయా! ఇప్పుడు నన్ను వారింపకుము; ఈవృద్ధవీరుని నిశితశరప్రకాండంబులచే నాశరీరము శతథాసంక్షతంబయ్యె— ఇంకనీతని రణప్రాగల్భ్యంబు నాకు దుస్సహము; రక్తప్రవాహ సంకులంబై కాయమెల్ల గాయములపాలయ్యె; యెంతని యోర్తును? రణమధ్యంబునఁ జక్రంబుదాల్చితినను దుర్యశంబు నకు నేను పాలైనను సమ్మతమే-దారివిడువుము.

అర్జు : బావా! శాంతింపవా! నామాటవినవా?

భీష్మ : అర్జునా! ఏల వారించెదవు? జగన్నాథునకుఁ నాపై ననుగ్ర హంబుగలిగెను; రానిమ్ము......తచ్చక్రానలజ్వాలలచే నా కంఠమును లుంఠనము గావింపనిమ్ము......శ్రీకృష్ణా! ఆర్త శరణ్యా! మహానుభావా! సకలలోకారాధ్యుండవగు నీ చెయి దంబు లక్రమంబులన సాహసింపఁజాలువాఁడెవ్వఁడు ?

(అనుబంధము 23)

జగతీరంగము నీనాట్యరంగము. సకలప్రాణి సముదాయంబును భవల్లీలారూపకంబు నందలి పాత్రంబులు, హేకృష్ణా! నన్ను వధింపరమ్ము. యుష్మచ్చక్రాయుధానలజ్వాలలం దాహుతిగా నున్న మత్కంధరంపు భాగ్యమే భాగ్యము.

సీ. అంభోధరశ్యామ - గంభీరకాంతి, ది
శాంతరంబులకు తే - జంబునీయ
వనమాలలిరువంక - ఘనవక్షదేశమం
దఖిలోక మోహనా - కృతినొసంగ
పదునాల్గు జగముల - భరియించు చిఱుబొజ్జ,
యదరుపాటున - సుంతకదలియాడ
అనిల సంచలితమై - యంసప్రదేశంబు
పైనున్న పచ్చని - పటముజాఱ

గీ. గ్రీడినదలించి చక్రంబు - కేలఁదాల్చి
నేఁడు గాంగేయుఁ ద్రుంతు; - నిన్నుఁగాతు
ననుచు, నభిముఖమైవచ్చు - నప్రమేయ,
దివ్యతేజఃప్రపుంజంబు దిక్కునాకు.

(పాట 23) (నమస్కరించును)

కృష్ణు : (శాంతినంది) శాంతనవ! భక్తవిధేయుండనగు నా హృదయ తత్త్వంబు నెఱింగిననీవు, బలవత్తరంబులగు భక్తిపాశంబులచే నన్నుఁ గట్టివేసితివి. ఇంక నేను భక్తపరాధీనుండనైతిని. నిన్ను సంహరింపఁజాల. నీవచించిన తెఱంగుననే పాండవులకు విజయం బగుఁగాక!

భీష్మ : మహాత్మా! నీ యభీష్టంబెట్లో యట్లుగావింపుము.

(తెరలో)

ఓరోరి గాంగేయా! ఇప్పుడెంచుఁబోయెదవు? నిలువుము. భార్గవ రాముని జయించి నాఁడుదక్కితివిగాక, నాటి యంబయే నేఁడు శిఖండియయ్యె, త్వత్ప్రాణహరణంబునకు సంసిద్ధనై యుంటిని.

భీష్మ : శ్రీకృష్ణ! ఇదియెల్ల నే నెఱింగినవిషయమే! మరల నిప్పుడీపేఁడి కి వీరత్వమేల? మరణింప నేనే స్వచ్ఛందముగ సంసిద్ధుఁడనై యుంటినిగదా!

కృష్ణు : ఔ నిది నిజమే! శిఖండీ! తొందరపడకుము; భీష్మమరణమునకు నీవే హేతువౌదువుగాక!

(తెరలో) మహాభాగ్యము.

భీష్మ : పార్థా! నీతో నింకొకమాట చెప్పవలసియున్నది.

అర్జు : పితామహా! సావధానమనస్కుఁడనై యున్నాను.

భీష్మ : గీ. నాదుజనకుని వరముచే - నాయువంబు
సమ్మతించినయపుడు పం - చత్వమంద
తెరవునాకుగలిగె; నంత - వరకు బ్రదుక
నంపశయ్యనునాకుఁ గ - ల్పింపుమయ్య.

అర్జు : స్వామీ! అట్లు చేసెదను.

(శిఖండి ప్రవేశము)

భీష్మ : (శస్త్రసన్యాసముచేసి కన్నులుమూసి) గోపాలకృష్ణా! ఈ పేడిని చూడనోప! శీఘ్రముగ మీకార్యము దీర్చుకొని యీ శిఖండి నావలకంపివేయుఁడు.

శిఖం : శ్రీకృష్ణదేవా! నా కానతియేమి?

కృష్ణు : శిఖండీ! అధర్మయుద్ధంబని లోకంబువాకొనకుండ నర్జునున కెదుటిభాగంబునఁ గూర్చుండుము; నీ వెనుకనుండి యర్జునుఁడు బాణములు వదలును.

శిఖం : (అట్లేచేయును)

అర్జు : (బాణములు విడుచును. భీష్ముడు నేలపైబడును అర్జునుడు అంప శయ్య కల్పించును)

భీష్మ : అర్జునా! దాహము దాహము.

అర్జు : తల్లీ! పాతాళ గంగాభవానీ!

ఉ. ఆలములోనఁ బాతభువ - నైక ధనుర్ధరుత్యాగి నీసుతున్
జాలిఁదొలంగి శాతశర - జాలము పాలొనరించినట్టి దు
శ్శీలుఁడనే మొగాన నినుఁ - జేరఁగబిల్తు సహించి తల్లీ! పా
తాళసురాపగా! తనయు - దప్పినదీర్ప సముద్భవింపవే.

(బాణము వేయును)

పాతాళగంగ ఊర్ధ్వధారయై భీష్ముని నోటియందుపడును.

కృష్ణు : మహాత్మా! కురుక్షేత్రసంగ్రామమునం దర్ధాంశము గడచి పోయినది. మిగతదానిం దేను మీదయచే సత్వరమునంబుగఁ బూర్తి కాఁగలదు. తమకిప్పుడేమి కావలయును?

భీష్మ : వృద్ధుండనగు నాకిప్పుడు లోకమంగళమునకన్నఁ గావలసిన దేమి? అట్లగుట కనుగ్రహింపుము.

కృష్ణు : తథాస్తు. (పాట 24)

(తెర వ్రాలును)

సంపూర్ణము

శ్రీరస్తు.

# అనుబంధములు

(ము. వెం. చె. కే.)

## 1—గంగా శంతనులు డైలాగ్.

శం : తలిరుఁబోఁడి యీపసినిసువునుడయుఁ, దలఁచి విడువు నిను బ్రార్థింతున్। చలముమాని మనవినిగ్రైకొమ్మా. చంపవలదుసుతు ముద్దులగుమ్మా! । తలనుదాల్పఁ దగినపూవుఁ. దగునె యగ్గివేయఁగా కలికి మానుమదిఁ జడితనంబున్, గనికరముఁన్ దలఁపనగున్ మనమున నీతనయుపయిన్ ॥తలి॥

గంగ : ఓమనోహరా! చాలున్ మీ, పల్లమున్ జింకల్ దవునే।నామనమ్మెఱిఁగి నన్నిటులాడన్ అన్యాయంబయ్యెడుఁగాదే, నేమాత్రము వాకొనవలెనే! మీ, రెఱుఁగ రేమి భూమిపాల! సమయము ॥త॥

## 2—గంగ.

నానియమంబిదిగాదుసుమా, నన్నునిటులనగారదుసుమా! నరవర ॥నా॥ ఏనెదినేసిన దానికి నోడఁబడె, దీపని సన్నొనిపమ్మితి నాయెద మానసముననది మఱపునుగొనినను, మానకదూయుట మాన్యంబెటు, ప్రియ ॥నా॥

విడుతొసఁగసయపని మొదఁటఁదలంపగొవు, పడిపెద పతివతినన్ వినుమా, । బుడుతను సినఎడిచెద నాసమయము, విడువలోకములు దలక్రిందైనను ॥నా॥

## 3—శంతనుఁడు.

కలికీ! కరుణింపు మన్నింపు, కసుగందుమసిసి, కన్నకుమారున్ ॥క॥ ధర "నపుత్రస్య గతిర్నాస్తి" యనుచున్, వన శాస్త్రంబుల్ కొనవా వినవే। తరపేం పుత్రహీనులకున్ దాఁటన్ గురుతర భవసాగరమున్ దలఁపన్ ॥కలికీ॥

4—శంతనుఁడు.

చాలుచాలు చాలు మదవతీ, జడమతీ, చటులఘోరగతి నిటు సలిపెదె ॥చాలు॥ నాతిగా నిన్సృజించిన యా, ధాతకున్ లజ్జలేదే నిజముగ ॥చాలు॥

ఇట్టులొనరింప నీమెఱ యెట్టులొప్పెనే, హీనురాలా! దుర్మార్గురాలా! ఛీ! । కట్టిఁడితనముగఁ దనయులజంపెదు, కాంతలు ధరఁ గలరే కుమతీ ॥చాలు॥

5—వ్యాసుఁడు.

హర! హర! హర! శర్వా ము, హాలాల! గౌరీవర! ॥హర॥ కరటిచర్మచేల! ని, ర్భరకృపాలవాలా! యో, పరమభక్తపాలా! వాగ్వరనుత భవహర! భవహర ॥హర॥

లీలాహతదుష్టదనుజ, జాల, ప్రళయఖేలా, శివ । హాలాహల కాలకంఠ యభవ! త్రిపురహర! భవహర! ॥హర॥

6—వ్యాసుఁడు.

స్వార్థమోహా దా, హమునకుబడి చెడిపోకుమా, లోకార్థము మనమా ॥స్వా॥ వ్యర్థమగునుజుమ్మా, సకలము పరమార్థమొకటే స్థిరంబుసుమ్మా ॥స్వా॥

7—శంతనుఁడు.

ఇన్నాతిసోయగము, యీపాటిపరువము, ఎన్నసెవ్వరితరము సఖుఁడా అలఅ ॥ఇ॥ ఐర్మారే నారీ, ఔరా! యొయ్యారీ, ఇయ్యతి వనుబోలిన మదగజగామిని లోలోమరేరీ సఖుఁడా అలఅ ॥ఇ॥

8—పాటలసంఖ్యలో ఏ దాశరాజు—నాకెంతో కోపం.

9—భీష్ముఁడు.

హరి! రాధానాథా! ప్రభూ! కృష్ణా ॥హరి॥
హరి! రాధానాథా! వేణుగానలోలా ॥హరి॥
జనకాజ్ఞన్ దీర్చన్,
ఘనజ్ఞానంబీరా ప్రభూ! కృష్ణా ॥హరి॥

## 10—భీష్ముఁడు.

సత్యవతీ పితృపాదా! రాజా! సత్కారుణాలయా! కృపఁగనుమా సత్కారుణాలయా ||స|| సత్యవతిన్ భవదీయసుతనా, జనకునకిడు నీ మనమేతీ ర్తున్, జనకపదముసాక్షి, కృపగనుమా, జనకపదముసాక్షి.||స||

## 11—సత్యవతి.

ప్రాణనాథ! నన్నునిటుల వాసిపోయెదే ||ప్రాణ||
శ్రీనిధాన! నీదుచరణసేవ నాకిఁకెట్లబ్బెదు ||ప్రాణ||
నీదాసిని ననుపీడియు, నీదిక్కున కేఁగెదె?
నీదిక్కునకేఁగిన, నేదిక్కిఁక నాకుఁగలదు ||ప్రాణ||

## 12—దాశరాజు.

నా, కేసినూశినా, నావాశినూశినా,
నా, యేసాన్నినూశినా, యేయింతి పైమడదూ ||నా||
మీాసాన్నిసవరిచ్చి, రోసాన్నినూయిచ్చి
కూసింతకనుగీటు, గుమ్మైపోవాలె ||నా||
ఇందరిలోపాల సందూరుడోలెను (అరెమంతిరీ)
ఎండిమొలతాడెట్టి, దంఁడిపాగానుట్టి
అందం సందంగలిగినేను, జొసుమీాగ నిలుసుండీ
డాబుసరి సానాసెత్తె డంగైపోవాలి |నా|

## 13—మాధవి.

కనుసకియ, నృపసమిది, చనువుమీాఱి |గను|
వనరుహ నేత్రుల, వారిజాక్షి. |కను|
ఈతఁడె మాగధుఁ, డీతఁడె సాళ్వుఁడు
ఈతఁడె వంగ మ, హీతలేశ్వరుఁడు |సకి|

## 14—దాశరాజు రాణి డైలాగ్.

రాణి : పెల్లాడ యెల్లాఁవురా, నీయుండమొయ్య! |పెల్లా|
పెల్లాడయెల్లాఁవ, పెల్లాన్నిదెచ్చావ?
రఁండీ! మీాయిద్దరికి పిండోంటలెడ్తాను |పెల్లా|

దాశ : చీ! లేదే! పెల్లాడిన నాయెంటరాదే? మనమంతిరి నడుగరాదె,
సేనాడకసలు పోలేదే,

రాణి : కౌ! లేరా! నేసంతయెఱుగుదుపోరా! నీ
పైన చెప్పవేపుురా! మీాయిద్దరి తిత్తొలుస్తారా!
పెద్దపీటమీాన యిద్దర్నీ గూసుండమెడ్తా. మంచివాటమైన పొర
కట్టు చేతనుబట్టా, పెద్దబొబ్బట్లు, మంచిలడ్డూలు, నేతిగారెలు,
పందారబూరెలు,
అన్నింటిమెడ్తా, ఆనందమెడ్తా
ఇద్దరిజుట్టుముడెట్టి యీాడ్సిడ్సికొడ్తా |పెల్లాడ|

15—అంబ.

హా! సాళ్వరాజా! యీావిధమున న, న్నాడుటన్యాయమే |హా|
వీసమేనీ, దోసమెఱుంగని నీచరణదాసిని నీవయయో |సా|
మదీయమానస మెఱుంగగలిగి తా, మసంపడ పాడియే, హా
దీశ, నాయెడ, నింకనైన నెంచవేకృప, యేలవేనను |సాళ్వ|

16—అంబ.

సదయా! వరింపరాదా, వాదా |సద|
(వర) మదనసదృశతేజా! రాజా! మదనసదృశతేజా! రాజా!
మదనసదృశతేజా, మదనసదృశతేజా |సదయా|
గతిలేని సతికయో,
ధృతిశరణమిడుట తగదే, యాహా |శర|శర|సద|
మతిలోన కరుణలేదో, సత్ప్రోవధర్మమానో, కాదో!
ప్రోవధర్మమానో, కాదో, ప్రో, కాదో, ప్రోవధర్మమాను, ప్రో|
ధర! నినున్ వేడెదన్ కాంతా! హా
ధర్మరతా! ధీరోదారా! ధర్మరతా! ధీరోదార!
ధర్మరతా! ధీరోదారా! ధర్మరతా, ధీరా, ధ| ధీరా| |సదయా|

17—అంబ.

చెడుగతినేఁబడితినే, స్త్రీత్వము గోల్పడితినే |చె|
ఈపరిభవం బేగతిదీరున్, ఈజన్మంబికనెటు గడతేరు |చెడు|

ఓగుణభవనా! ఓజగదవనా!
నాగతి, కానన్ నవయుటయేనా ।చెడు।

18—భీష్ముఁడు.

నమస్కృతులయ్యా దేవా! సద్గురూ ।నమ।
శమ దమ గుణములు, శస్త్రాస్త్రవిద్యలు
తమకడనేర్చిన త్వత్పదదాసు (నమ)

19—అంబ.

సుజన గణావనా శౌరీ!
సుమనోహరీ! యరిజన భీషణ (సుజన)
ఉరుకృపావసతి స్మరనిభాకృతీ
విశ్వలోకపతి శాశ్వతసుకృతీ
విదళితాఘతతి, వినుతామరపతీ (సు)

20—సత్యవతి.

ఎంతటి దోషముసంఘటిల్లె తుద కెంతటి దుష్ప్రాప్తముగలిగె నకట (యెం) ఇంతటి పాపంబెటులుపోవునో; యెటుల మద్వంశ మున కెసఁగునో శుభం (బెం) హా! యీశ్వరా! నాదుసంతతి, కథోగతి నీగతిగూర్చితే ప్రభూ! న్యాయమనక యయ్యోయీ బాలునిసయితము గడురోగమునన్ద్రోతే సంశ్రితాళిబంధు, గుణ సింధూ! శాశ్వతకీర్తి సదమలమూర్తీ (ఎంత)

21—శ్రీ కృష్ణుఁడు.

సురేంద్రనందన! ననువిడుమి దేయీ, దురాత్ముభీష్ముని శిరమునుద్రుంచెద
భరింపశక్యముగాకున్నదిగా, స్ఫురచ్ఛాంతనవ ఘోరశరంబుల్
తరంబెనినుబోంట్లకున్ గెలువ నాపరాక్రమాధ్యుని దురంబునందున్ సు।
గాంగేయుతోలుతఁ జంపి పిదపన్ ఖండించెదఁ గురురాట్సైన్యంబున్
కరగతమొనరుతుఁ గురుకులరాజ్యము గడకనుధర్మజునకు నిక్కముగ।

22—అర్జునుఁడు

మనవివినుమ నీవే చక్రముగొన, మాధవ! యేనరులాజినినిల్చెదరు,
ఏగతినిగెల్చెదరు (మ)

నీతులుసెప్పితి, గీతలుపల్కితి, నీవేళలనికినను బురిగొల్పితి
వీతతి ధర్మంబెల్లబోవిడి, యిటుకడుకనలునఁ జక్రమువట్టిదెను

23—భీష్ముఁడు

నీ నిరుపమాన చక్రాహతిన్ నాశిరమ్ముద్రుంచరా
నిర్మలా, నిశ్చలా, నిర్వికల్పా (నీ)
కన్నుదోయి యానందబాష్పములు, గార్చుచుండఁగా
జిహ్వకృష్ణకృష్ణాయనన్ నా, శిరమ్ము నీదుపాదములబడవలెన్
వైరిభీషణా, సాధుపోషణా! మంజుభాషణా! (నీ)

24— భీష్ముఁడు

నీమాయగన నెవరివశమురా, నిఖిలసృష్టిస్థితివిలయకారణా నీ
మాయామేయము ప్రపంచము, మాయ నీదు లీలావికారము
మాయఁజిక్కి మాదృశుల మహాత్మ్యమును మాయసేయుమటు
మాయలకాఁడా; (నీ)

## పాటలు

(గ్రంథకర్తగారివి.)

1. శంతనుఁడు.

సురట – త్రితాల్.

ఓ పుత్రప్రాణహారిణీ! ఓ! హా! ఖలకార్యప్రచారిణీ (ఓ)
భువన కంటికి నీమూలమున, పుత్రసప్తకము గోలుపోయితిని
యవనీతిని నిన్ను గౌరవించెద నటవే కుటిలాత్మకదురాశయా(ఓ)
అవనిని పశుపక్ష్యాది జంతువులకైనను సంతతిపై ప్రీతిగల్గు,
ప్రకృతి విపరీతగుణంబుగల్గిన పాపినీ నిన్ని కేమందునో (ఓ)

2. గంగ – శంతనుఁడు.

జైలాగు, మోహన—దాద్రా

శంత: దురితమే, దురితమే, పరమ కఠినమానసయిది (దు)
నరులకిటుల సలుపదగదు నరాశనగుణంబుమాను..........
గంగ: ......పలుకవలదు–మమతచనదు కులము నిలువబోలదూ
శంత: (ఆర్తి) హరిహరి యిది సుకృతంబా,

గంగ : .............నాకదియే ఘనసుకృతంబా
శంత : ............విడనుసుతుని,
గంగ : ............విడచెద నిను,
శంత : ............ఇంతపంతమేటికే (దురి)

3. గంగ, హిందోల్—ఆది.

దురాశన్ మదిని విడువుము శంతనూ (దు)
నిరాశన్ గొనుము విమలచింతనా (దు)
తనయులపై గాంతెూత్సుకమైనను మనమునవాపై
మమతవిడువుమా చనియెద నానందమున సు
రపురికి మనందగును నీవని సుగోనిత్రో (దు)

4—శంతనుడు. సురట-(దాద్రా)

వాకేయెయ్యారి యీామెపతి (వాకే)
నీరే జంబులగేరెడు నిర్మల నయనముల సొబగు కారు
ణ్యము దోవఁజేయ కమల నిభంబగు వదనము (వా)
భువికిది గుతటితాకృంతియొ తనువుగనిన సౌందర్యమొ
మరల జననమునుగాంచిన సురాపగయొ సురాంగనయొ (వా)

5—దాశరాజు. బ్యాగ్-త్రిశాల్.

నాకెంతో కోపమొచ్చిందీ నాయింటిదాన్ని నేను కొట్టవలసొచ్చిందీ (నా
ఒకల్లైన నామాట కొప్పుకోనకున్నారు కాకపోతే రాణి
నన్ను గడ్డిపరకనుకుంది (నా)
భూమి మీాద అందరికీ పొయ్యేకాలమొట్టింది సావిరంగ
నేనింక నచ్చిమోతానియ్యాల (యెం)

6—దాశరాజు-రాణి. బ్యాగ్-త్రిశగతి

ఎందుకీ పెతాపము నీవేడుత్తున్నావొకాని తొందరేల పొరక
పూజ చాలురా నీకు చాలురా మంచిపేళరా పాడు
గోలరా యింటి నేలరా (యెం)
ఉండుండు నీకియ్యాల ఉండరాము లుండాయి మెండైన
పొరకకట్ట రెండైపోతానోలె చెండేను వీపుమీాద చిఱ్ఱు
బుఱ్ఱు మనకుండ వదుడుంటె కాపురాన్ని పాడుసెయ్యదలిశావ

7—సత్యవతి. (ముఖారి-త్రితాల్)

జీవితేశ నాజీవనమిక నే త్రోవసలిపి పోయెదరోసదయా (జీ)
హావిధి యికమీాయనంతరంబున నీపురినాకు శ్మశానమేకాదా

8—భీష్ముఁడు. (మధ్యమావతి-త్రితాల్)

జనకా తమ వరదానము శిరమున ధరియించెదగా పరమా
దరణమునకు బ్రహ్మానందము గనుగొంటిని (జన)
ఈవరదానము భారత భావి మహాసంగరమున దేవా నా
నాకనుకూలం బగును శుభంబగు వేళల! (జన)

9—దాశరాజు. (చాపుతాళం)

ఇయ్యాల నేపాడుమొగము నూశానా నాకెయ్యారు పాడు
శకునాలూ (ఇ)
వియ్యానికెళ్ళితే దయ్యాలతి వెంటబడి కయ్యాని కొత్తేను
కంగారు పడ్డాను (ఇ)
కాశిలోవల రాజు కన్నబిడ్డలకు పెళ్ళంటేను నేబోయినాను
నాచక్కదనము దానికి నచ్చలేదేమొ నా మీాఁదకన్నెయ్య
లే దొక్కపాలైనా (ఇ)

10—దాశరాజు-రాణి. (ఆదితాళం)

అప్పుడుదప్పిన పొరకపూజ నీ కిప్పుడు తప్పదురారా (అప్పు)
గొప్పరాణివలె సాయంకాలనికి గోటుమీాఁద నీవెల్లితివా
ఉప్పుదెబ్బలిక చాలవురాణి చీపురుదెబ్బలుతిందువుగానీ (అ)

11—భీష్ముఁడు. (ముఖారి-త్రిశ్రగతి)

అమ్మానీవార్తి గొనకుమమ్మా యిట్టేచ్ఛనరుగుమమ్మా షా
రపడితిని మాయమ్మా (అ)
నీదుహృదయమిపుడు డస్సె దీనమగుట నెఱుగమి నిను సోదరీ
యుగంబుతోడ సుఖముగ జేరిచితినిందు (అ)
సాళ్వభూమిపతిని నీవు సమ్మతి వలచితివేనియు నాతనిదరి
కిపుడు జేర్తునమ్మా ధృతిఁబూనుమమ్మ (అ)

12—సాళ్వుఁడు.

ఛీఛీఛీ, జారిణి, కలుష ప్రచారిణీ (ఛీ)
స్వచ్ఛందసంచారిణీ, ప్రళయాహంకారిణీ (ఛీ)
నిరుపమాన కాశీరాజాన్వయ నీరధికిని దీరని కళంకమును,
దరికొలిపి భీష్ము దరిజేరితివే, పరమ నిర్భాగ్యవతి, దుర్గతి (ఛీ)
ఏమని తలచితివి సాళ్వునీ మది, కామవశుండై నినుబోలిన
దు, ష్కర్మురాలి గవసెదననుకొంటివే కలుషనిచయ, కామినీ
భూతమా (ఛీ)

13—భీష్ముఁడు

లఘురహితా, సుకృతాత్మవు జననీ, విఘటనమయ్యె నీ, విధ
మున తల్లిరో (అ) ఏమి సలుపగల, నెటు దయగనగల, నీ
మహినే బ్రహ్మచారినం చెఱుఁగవె (అ) నీమదిగోరిన భూమీ
శ్వరుతో, నో మానవతి సు, ఖింపువరింపుము (అ)

14—అంబ (ఆదితాళం)

ఎంతని యిఁకను, శాంతినిగనెద, స్వాంతముననో మృత్యో
దేవతా (యెం) పంతమున న న్నంతముశలుష, వెంతటి
కఠినహృదయురాలవో (యెం) ఈ తాపము స, హింపగగలనె
చేతంబు నిరసించె జగంబును (యెం)

15—అంబ—బీన్ పలాస్—రూపకం.

ఆహాహా యెటుల్ సైతునో (ఆ) మహాభీల దుఃఖంబులన్ (ఆ)
దహింపగనయ్యెన్ దేహంబు నాద్యంత మున్ ఆఆఆఆఆ యెట్టి
ఘోరపాతకంబు లేనొనర్చియుంటినో ఉభయభ్రష్టత్వము మరి
యుపరిసన్యాస మనుట యిదియేయని యిప్పటి కనుభవముచేత
దెలిసికొంటి (ఆ)

16—పరశురాముఁడు-మాల్ కౌజ్-త్రిశ.

నాపాణికిన్ దాల్చి పరశు వేపడగించెద నీభువి భూపాలక కోటి
నెల్ల భోలియగన్ గలిపెదన్ భుజబలోద్ధతులచే (నా)

చింతిలకమ్మా రమణీ వంతదాలగజేయువాడ నంతమునొందించె దనీ యరుల పరశుధారచేత (నా)

17—పరశురాముఁడు, భీష్ముఁడు (డైలాగు)

పర : బాలుఁడ వెఱుఁగవు నా బలమున్ దూలించెదనీ దోర్బల మెల్లను (బా)
భీష్మ : జయమీాభువి నీ శ్వరాధీనమగు చలమేటికిభూసురవీరవరా (జ)
పర : ......బహువర్షంబులు గడచెను మద్భుజబలమున్ ప్రకటింపగ లేనైతిని (బా)
భీష్మ : సమరమునకు తడవేలా?—
పర : ........పరశువుదాల్చితి వే రారా
భీష్మ : వస్త్రములు చాలునో ధీరా
పర : ఇక రారా తడవేరా (బా)

18—అంబ—చక్రవాకం—ఆది.

అంబా సద్గుణనికురంబా అఖిలపాపసంహార మహిమాన్వితాంబా (అం)
నిరంతరము నీ పదములు గొలిచెద సురాసురాఖిల సన్నుతవరదా పరా
త్పరీహారి పతితపావనీ కరధృత నిరుపమ గంభీరాయుధ (అం)
ఈజన్మను సలిపిన నాదోషము లెల్లను దయతో మన్నింపగ దవే పూజితాఖిల నిలింప స్వయంభూ మరుజన్మను భీష్ముని సమయింపవె (అం)

19—సత్య్రసన్ని. నాదనామక్రియ-రూపకం.

ఏమిసేతు దైవమాసే నెటుల బ్రదుకుదాననింక శ్రీమహితంబగు వంశము శీఘ్రమేని కూలిపోవునుగద (యేమి)
పతిగతించె నేకసుతుఁడు బహుతరరోగాన్వితుఁడై ధృతిజెడి మరణింపనుండె దురదృష్ట మేమోయిది (ఏ)

20—భీష్ముఁడు. సింహేంద్రమధ్య.

హే యాన్వీటమిాఁజగంబు మాయా పటుభీషణ దుఛ్ఛాయా దీనికోఁలుట సుమతహాయా (హే)

సారరహితమైన సంసారబంధము మానవులకు తీరని ఘనపా
శమగుచు బంధించును దృఢతరముగ (హే)

(సాకీ) దారాపుత్రధనాది సంబంధబంధంబే
మానవపూర్వ పునర్జన్మములకు హేతుభూతంబూ

(మిశ్ర) ఈ సకలజగతిలోన వీని సంఛేదించిన జనులకు జన్మ
దుఃఖ జలాదుఃఖసంక్షోభము గలుగదమ్మ (హేయ)

21—భీష్ముఁడు (ఈతీరుగా బల్కిన మీనాలుకవలె)

సంగ్రామమున్ సల్పెదు మీవైరులను ద్రుంపదగునురణమున్
సలుపంగాజనుఁడూ మీబాణాసనంబుల గొనుఁడికమీ
మహాబాణాసనములం గొనుఁడిక రిపులను బరిమార్పఁదగు
ఘోరముగ (సం)
పటుతరమగు పాండవసైన్యములన్ భరంబయిన మీ పౌరు
షంబుల పరాక్రమంబున ద్రుంచి వేయుడీ కడున్ రయంబున
కడున్ రయంబున (సం)

22—అర్జునుఁడు (నాపలుకులు వినదగు మట్టు)

ఈరణమును గనుగొన భరముగ దోచెను మనమున నెది
యును దోఁపదు హరియీ (రణ)
ఆభీష్మున్ గనుగొనన్ కాలరుద్రునిగతి వెలిగెడు నేపగిదిని
యీసమరము సేయదగునో తెలియదు (ఈ)
పదిదినములు గతియించెనుగా మరిమొకయింతయు సణగ
దుగా - ముదుసలి యాతడనుచు దలచిన యీ - గతిచకుసా
ధ్యుఁడై కాన్పించె (ఈ)

23—కృష్ణుఁడు, అర్జునుఁడు, భీష్ముఁడు. బ్యాన్-చాపుతాళం.

(ఈశరముచేత నాశనముజేసి యాహాశనము మట్టు)

భీ : ఈరణమునందు మిము మార్గణముజేసిమూ - భూమణుగసక్ష
ద్రీతిసలిపెను గనుడీ (ఈర)

కృ, అ : బాహుశూరులకు వృథా వివా - దమేలమానుడీ
భీ : వీరసూనులయిన మదిని భీతిగొనక నిలువుడి - అదరు బెద
రు లికనేలా-
కృ, అ : అటులయిన శరముగొన వేలా-
భీ : శస్త్రమునగూల్తురా బాలా - ఛీబాలా ఛీబాలా (ఈ)

24—కృష్ణుఁడు. బ్యాన్-ఆది.

అక్రమమో, సక్రమమో, చక్రంబున ద్రుంపక విడువను గను
పదిదినములనుఘడ్డీతు నొకవిధమున - పరాక్రమము జూపెడు
బ్రహ్మచారి - పదనుశరంబుల బడలెశరీరము - వదలన్ భీష్మ
వధించివై చెద (అ)

25—భీష్ముఁడు, పూరికల్యాణి—ఆది.

పాహిపాహిమాంపాహి దయానిధి బహుళభవహరణ పావన
చరణా (పా) అమలసురత విదితచరిత - విగతదురిత విమల
నిరత సలిల భవపాదాంబుజాత - సకలభువన స్వయంభూత
సోమసూర్యవిలోచన సుమనోవిధాన సూరిసన్మాన (పా)

మంగళం.

మందరధర - మంగళకర మంగళంబురా (మం)
మారసుందరా - శ్రీరమేశ బోధవరా దాసభరణా దోషసార
ణా దానవేశనాశా రాజరాజేశ్వరా - పరాత్పరా - శ్రీనివాస
జగదీశా శ్రీరమానాయకా జగన్నాయకా (మంద)

సంపూర్ణము



# ప్రకటన

మాకు సర్వహక్కులు కలిగిన ప్రఖ్యాత రచయితలచే వ్రాయబడి పేరుగాంచిన స్టేజినాటకములు, కథలు, చరిత్రలు, నవలలు, స్త్రీలకు ఉపయోగించే అనేక ప్రఖ్యాత గ్రంథములు కలవు. కాపీరైటు యాక్టుప్రకారము మా అనుమతి లేనిదే ఏ రచనలు నైననూ, ఎవ్వరూ, ఏవిధముగా వుపయోగించుకొన్ననూ, వారిపై నేను జరుపు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని ఇందు మూలముగా తెలియ జేయడమైనది.

శ్రీకృష్ణతులాభారం, చింతామణి, మధుసేవ, రంగూన్ రౌడి, ధరణికోట, సతీసక్కుబాయి, ద్రౌపదీవస్త్రాపహరణం, కురుక్షేత్రం, (ద్రౌపది), విప్రనారాయణ, చండిక, ఖిల్జీరాజ్యపతనం, (ప్రతీకారం), కోకిల, పాదుకా పట్టాభిషేకం, చంద్రగుప్త ఈనాటకములలో ఏనాటకమయినను, నాటక భాగమైనను మా పర్మిషన్ లేకుండా ప్రదర్శించరాదు. నాటకమునకు ముందుగా పర్మిషన్ ఫీజు చెల్లించి రసీదుపొంది ప్రదర్శించవలెను. అట్లు పర్మిషన్ పొందకుండా ప్రదర్శించువారిపై మేము జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని హెచ్చరిక.

మావద్ద లైబ్రరీలకు, వర్తకులకు, సాహిత్యాభిమానులకు, స్కూలు గ్రంథాలయములకు, డిస్ట్రిక్టుబోర్డు, సెంట్రల్ లైబ్రరీలకు న్యూస్ ఏజంట్లకు మొదలగువారికి పనికివచ్చు అన్నిరకముల గ్రంథములు కలవు. భారీగా ఆర్డరుయిచ్చు వారికి మంచికమీషను యివ్వబడును. కోరిన వెంటనే కేటలాగు పంపబడును.

**కురుకూరి స్వరాజ్య వెంకటసత్యనారాయణరావు**
ప్రొప్రయిటర్.

**సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1**

రైల్వే బుక్ స్టాల్సు: ఏలూరు పేట, తాడేపల్లిగూడెం, నెల్లూరు